REG.No.M.2185 REG-No.N45

The First Telugu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for H. E. H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు—దక్కను

103150 GOLAKONDA PATRIKA. HYDERABAD Dn

సంపుటము ౫ | ప్రమోదూతనామ సంవత్సర కార్తిక బ॥ ౨ శనివారము 8—11—30 | సంచిక ౪౯

(FREAK PILLS)

## ఫ్రీక్ పిల్సు

### ముసలివాండ్రను యౌవన వంతులుగా జేయును



సలుచబడిన వీర్యమును గట్టిపరచును. ఎక్కువసేపు బలమును కలుగజేసి సంసార సౌఖ్యమునకు అవకాశ మిచ్చును. శరీరమునకు తేజస్సు కలుగజేయును. ఎటువంటి సుఖసంబంధమైన జాడ్యములైనను జేరజాలవు. 1 గంటలో వీటి అద్భుతశక్తిని కనబరచి ఆనందమును కలుగజేసి స్త్రీపురుషులను తనివినొందించు వైరాగి చిటుక. రసవిష గంధకాదులు కలియలేదు. గొడ్డాండ్రకైనను సంతానము కలుగును. 20 మాత్రల సీసా రు. 2-0-0; 60 మాత్రలు సీసా రు. 5-0-0

సెగలకు జర్మనీ ట్యూబులు 30 పెట్టె రూ. 2—9—0 పోస్టేజి వేరు. ఆర్యవైశ్య ఆశ్రమం, చికాకోల్ సిటి, (గంజాంజిల్లా)

స్వరాజ్య మిదుగో! **సిల్కువంటి మజిలీను తాన్లు** కొరుచౌక!!

45 అంగుళముల వెడల్పు 12 గజములది 6 కమీజులకు సరిపడును. రూ 7—8—0 లు దొరలు మిక్కిలి ప్రీతిగా వాడుచున్నారు. అన్నికాలములలోను వాడదగినది. కష్టాల ఆధారములు పనికిరానివైనవి 15 అంగుళముల మెడకొలతగల 6 కమీజుల పెట్టె రు 9-0-0 అక్కరలేనిచో ఖరీదు నావసు చేతుము శ్రీకాకుళం మజిలీనులకు పేరువడసినది. 7 గజంల 2 చీరెలు రూ 7-8 Gupta & co Chicaoole City

## బంగారు హనుమాను మంత్రకవచము

భూమండలమున యెందరో మహాపురుషులు కలరని నిర్ధారణకు మాకవచమొక నిదర్శనముగా దిగంబర యోగిపుంగవుని మహామంత్రములచే యెవరికోరికలు కొనసాగవు? సందేహమున్న వారికి యీసమయము దాటిపోయినవెనుక విచారించుట వింతగాదు. బ్రహ్మరాక్షసులు, శాకినీ, ఢాకినీ, చిల్లారిష్టములు ఈకవచము ధరించిన బాసిపోవును. గొడ్డువాండ్రకు సంతానమును, బీదలకు ధనమును, నిరుద్యోగులకు సదుద్యోగమును, విద్యార్థులకు తెలివితేటలును, విటకాండ్రకు వశీకరణమును, రోగులకు నారోగ్యమును, రాజులకు జయము, అనారోగ్యులకు నారోగ్యమును చేకూర్చుననుటకు సందేహింప నవసరములేదు. కోరికలను ప్రసాదించుటలో కల్పవృక్షమును మించును. వేలకొలది యోగ్యతా పత్రములు మావద్ద కలవు. మానవులలో యెట్టిశక్తినైనను గలదని పురాణములు శోధించు వారికి తెలియకపోదు. త్రిశంకుడు విశ్వామిత్రుని మహామంత్రశక్తిచే స్వర్గమునకు బంపకలిగెను. విశ్వామిత్రుడు మానవుడని యెల్లరెరింగిన విషయమే, ఈసమయము మించిపోయినచో దొరకుటఅసాధ్యము.

రాబోవు సంగతులు ప్రశ్నలకు రూ1 జవాబుచూడు మేలుబంగారు హనుమాను కవచము ఖరీదు రూ. 5—0—0 వెండిది 3—0—0

పసిద్ధిరామకవచము (స్పెషల్) బంగారుది స్పెషలు ఖర్చు 8—0—0 డిటో రాగిది 2—8—0

పండిట్ ఆర్యవైశ్యాశ్రమము, నాగావళీవద్ద చికాకోల్ సిటీ (గంజాంజిల్లా)

కలరా కలరా

నలువైపుల కలరా వ్యాపించినది, కాని పరమేశ్వరుని కృపవలన

## జిందా తిలస్మాత్

జానితో నెట్లు పోటీ చేయుచున్నదో చూడుడు

పద్మజీ పిస్టంలో ముఖ్తారులగు రహీంఖాన్ సా॥ మాకిట్లు వ్రాయుచున్నారు —

అబ్దుల్ కరీం సా॥ సర్దారులకును భూసాక్ కంపెని కర్మచారులగు నోబారు గారికిని అత్యంత నౌకరులగు కలరా సోకెను వీరుతమ ప్రాణములపై ఆశవదలుకొనిరి కాని కరామతుల్లా హుసేన్ సా॥ వర్తకులు మున్నగువారు ఔషధమును క్రమముగ నుపయోగించిరి అందుచే వారు ఆరోగ్యమును బెందిరి

దీనినిబట్టి మేము విన్నవించునదేమన అంటువ్యాధులగు కలరా ప్లేగు సంభవించినపుడు జిందాతిలస్మాత్ యొక్క ఒక చుక్క మొదలుకొని అయిదుచుక్కలవరకు వారివారి వయస్సునుబట్టి త్రాగినను ఇచ్చినను ఈ వ్యాధి అంటబడదని తెలుపుచున్నాము టెలిఫోన్ ౬౦౩

కార్ఖాన జిందా తిలస్మాత్

Zinda Tilasmath

చీగూడ, హైదరాబాదు (దక్కన్)

స్థాపితము

## ఆంధ్ర బ్యాంక్ లిమిటెడ్ 1923

హెడ్ ఆఫీసు మచిలీపట్టణము శాఖలు కాకినాడ హైదరాబాదు దక్కన్

కరెంటు ఎకౌంట్లు. రూ. 100. అ తకువపై మొత్తములతోను తెరువ వచ్చును జనవరినుండి జూన్ వరకు సం॥ నకు రూ. 2½%, జూలై నుండి డిసెంబరు వరకు సం॥నకు 2% చొప్పునను, నెలసరికనీసపు నిలువ మొత్తములపై వడ్డీయివ్వబడును. హోలీ ఎకౌంట్లమీద జూలై నుండి డిసంబరుతో అంత్యమగు ఆరునెలలకు వడ్డీఇవ్వబడదు. ఒక్కొక్కరిపేర ఒ హోలీ ఒకకల్దారు ఖాతా తెరువ వచ్చును.

సేవింగ్సు బ్యాంకు ఎకౌంట్లు: రూ. 5తో తెరువవచ్చును. కల్దారు ఎకౌంట్లపై నూటికి సం॥ నకు 4½, హోలీ ఎకౌంట్లపై నూటికి సం॥నకు రూ. 4చొప్పునను, ప్రతినెల6వ తేదీ మొదలు మాసాంతము లోగా, రూ. 3000 లకు మించక నిలువయుండు కనీసపు మొత్తములపై వడ్డీఇవ్వబడును. ఒక్కొక్కరిపేర ఒకహోలీ ఒకకల్దార్ ఖాతా తెరవవచ్చును.

ఫిక్సెడ్ డిపాజిట్లు రూ 5000 వరకూ ఒక సంవత్సరమునకు 4½% ఇవ్వబడును. ఇంతకు మించిన మొత్తము లకు గాని సంవత్సరముకన్న ఎక్కువ కాలము నిలువ యుంచబడు మొత్తములకు గాని ఇవ్వబడు రేట్లువివరము, బ్యాంకునందు తెలిసికొనవచ్చును.

బ్యాంకు ఆదివారము తప్ప ప్రతిదినము 9 గంటలు మొదలు 3 గంటలు } వరకు తెరచి
శనివారము 9 గంటలు మొదలు 1 గంట } యుంచును.

డి. యన్. శాస్త్రి ఎ. ఏ. వర్క్స్. ఎ. ఐ. బి. సెక్రటరీ } ఎస్. ఎమ్. ఎస్. విజయం ఏజంటు

మీ ప్రాంతములో

## ప్లేగుజాడ్యోపద్రవం

ప్రబలినట్లు
యేమాత్రపు
సూచన లగుపడినను
వెంటనే

వైద్యరత్న
పండిత డి. గోపాలాచార్యులవారి
సుప్రసిద్ధ
మహామారి నివారకౌషధములగు

## ప్లేమాది పానకము

(రిజిష్టర్డు)

## శతధౌతఘృతము

అను ఔషధముల దగ్గరుంచు కొనుట శ్రేష్ఠము ఈ ఔషధములు ముప్పదిరెండు వత్సరములనుండి భారత దేశము నందన్ని ప్రాంతములందును ఉపయోగింపబడుచుండుటే గాక తాలూకా జిల్లా బోర్డులకును, మ్యునిసిపాలిటీలకును, పారిశుద్ధ్య శాఖవారికి నివే శరణ్యమగుచున్నవి వ్యాధి ఎంత తీవ్రదశయందున్నను యీ మందులు వెంటనే జవాబొసంగును. ప్లేగు ప్రబలు నప్పుడును అగిక వెంటనే ఒక్క పెట్టె దగ్గరుంచుకొనుట యుక్తము.

పెట్టె 1 కి రు 1-2-0 మాత్రమే.

## ఆయుర్వేదాశ్రమము

151, గోవిందప్ప నాయకవీధి
తపాల పెట్టె 287, మదరాసు.

తంతివిలాసము — ,,పండిట్'' మదరాసు

ఏజంటు —
ది రామకృష్ణా స్టోర్సు
మార్కెటువీధి సికింద్రాబాదు

రాత్రింబగలు మోటారు టాక్సీలు లభించును.
కరీం మోటారు టాక్సీ
ఓ. వ. నిజామాబాదు పల్లి హైదరాబాదు స్టేషనురోడ్డు




## మనకర్తవ్యము

గత శనివారము జరిగిన సహకారుల దివసమునాడు సహకార శాఖోపాధ్యక్షులగు మౌల్వీ అబ్దుల్ వహాబుసా॥ దేశీయులకొక సందేశ మొసగిరి. దానిని స్థలాంతరమున ప్రకటించియున్నాము. వీరు దేశముయొక్క ఆర్థికస్థితిని వర్ణించుచు ప్రజలు దరిద్రులై యున్నారనియు విద్య రాదనియు, ఆచారములకు దాసులనియు, వృథా వ్యయము చేయుదురనియు, తెలిపియున్నారు. ఈ దుస్థితి తొలగుటకు వారు దిగువ నాలుగుసూచనలను గావించిరి:—

(౧) నిర్బంధోచిత ప్రారంభవిద్య

(౨) సహకారసంఘ స్థాపనము.

(౩) ఆబ్కారీ రద్దుచేయుట

(౪) సుంకపు పన్నుల తొలగించుట.

కనుక వీనిలో నొక్కొక్క విషయముగూర్చి విచారింతము.

దేశమునందలి అజ్ఞానము తొలగించుటకు విద్య యావసరము. ప్రజలలో ఇంకను విద్యనుగూర్చి ప్రేమ కలుగలేదు. వారుదీని యావసరము గూడ గుర్తెరుగలేదు. కనుక ప్రభుత్వమువారు ప్రజలను విద్యనేర్చుకొనుటకై నిర్బంధపరుచవలసియున్నది కనుక ప్రజాపక్ష విద్యామహాసభవారు దీనిని ప్రవేశ పెట్టుటకై కోరిరి. ఇటీవల మనరాజకీయ శాఖవారు ప్రకటించిన దానివలన ఈవిషయము ప్రభుత్వమువారి ఆలోచన యందున్నదని తెలియుచున్నది. ఆలోచనలోనే సంవత్సరములు గాకుండ వెంటనే అమలులోనికి తేవలయును.

అబ్దుల్ వహాబు సా॥ ప్రతిగ్రామమున నొక సహకార సంఘముండ వలయుననియు, అదిసక్రమ పద్ధతులపై నడచిన ప్రజల ఆర్థికస్థితి చక్కబడుననియు, తెలపిరి. ఇదియంతయు నిజమే. కాని ప్రస్తుతము రైతులును, పరిశ్రామికులును, విద్య రానివారగుటచే ఇప్పుడు స్థాపింప బడిన సంఘముల నుండి, లాభము పొందజాలకున్నారు. కనుక సహకార శాఖవారు సంఘమున్న స్థలమున దాని పక్షమున రాత్రిపాఠశాల నెలకొల్పి మొదట సంఘ సభ్యులకును, తదుపరి ఇతరులకును, విద్య నేర్పినచో, ఎంతయో లాభము కలుగును. ఈవిషయము హైదరాబాదు సహకార కేంద్రసంఘము యొక్క విధ్యుక్త ధర్మములలో చేరియున్నది. కావున వారు శ్రద్ధవహించవలయునని కోరుచున్నాము.

ఆబ్కారీని రద్దుచేయుటకై సూచించినందులకు మేము అబ్దుల్ వహాబుసా॥ నభినందించుచున్నాము. ప్రభుత్వమువారు ఆబ్కారీ తొలగించిన గొప్ప ఆదాయమును కోల్పోయెదమని భీతిల్లుచున్నారు. కాని ప్రజలెట్లు బికారులగుచున్నారో వారి నైతికస్థితి యెంతహీనమగుచున్నదో గమనించుటలేదు. ఆదాయమునకు లోటురాకుండ ఇన్కం టాక్సు (Incometax) లేక ఇంకేమైనను పన్ను విధించవచ్చును. ఆబ్కారీ తొలగిపోయిన ప్రజల ఆర్థికస్థితిగూడ బాగుపడును కావున వారు మొట్టిపన్నులనైనను, చెల్లించుటకు సిద్ధముగా నుందురు.

కరోడ్గిరి మహసూల్ గూర్చి మేమెన్నియో పర్యాయములు వ్రాసియున్నాము. ఆ శాఖవారే కాని ప్రభుత్వము వారేకాని దానిపై శ్రద్ధ వహించలేదు. ఈ సుంకపు పన్నులవలన పరిశ్రమలకు నష్టము కలుగుచున్నది. దీని వలన ధరలు హెచ్చుటచే దేశీయ వస్తువులు కొనువారు వెనుకంజ వేయుచున్నారు. మన ప్రభుత్వమువారు దేశాభివృద్ధి నిజముగ కోరుచున్నచో ఈ రాష్ట్రములో తయారగు ప్రతివస్తువుపై కరోడ్గిరి మహసూల్ తొలగించి దీనిలోటు పూర్తికై ఇతర రాష్ట్రములనుండియు, విదేశములనుండియు వచ్చు వస్తువులపై పన్ను హెచ్చించవచ్చును. దీనినే ప్రెఫరన్సు (Preference) పద్ధతి యందురు. ఈపద్ధతి బ్రిటిషు ప్రభుత్వము వారాచరణ యందుంచి ఇంగ్లండు పరిశ్రమల పోషించు చున్నారు. మన పరిశ్రమల రక్షణమునకై ఈ విధముగ నేల చేయరాదు? ఇప్పుడు భారత జాతీయ నాయకులు కోరుచున్నదిదియే. హైదరాబాదు స్వదేశీ లీగు వారు కోరుచున్నదీ దేశాభిమానమే. ఇది ఒక జాతిపై ద్వేషము వలనకాదు. కాని తమ పరిశ్రమల పోషించుకొనుటకై చేయబడుచున్నది. కనుక ప్రభుత్వమువారు పై విషయములగూర్చి నాలోచించెదరుగాక! ప్రెఫరన్సు పద్ధతియేవిధముగ నాచరణయందుంచవలయునో ముందు వ్రాయుటకు ప్రయత్నించెదము.



## స్థానిక వార్తలు

### సహకారులదివసము

శనివారమునాడు నాలుగు గంటలకు రెడ్డివిద్యార్థి హాలునందు హైదరాబాదు సహకార కేంద్రసంఘపక్షమున నైజాము శాఖామంత్రులగు నవాబులుత్ఫుద్దౌలా బహద్దరు యాజమాన్యమున సహకారులదివసము జరుపబడెను. మదద్గారు రిజిస్ట్రారులగు అబ్దుల్ వహాబు సా॥ కార్యాచరణ సందేశముగూర్చి యుపన్యసించుచు స్వదేశ పరిశ్రమలభివృద్ధి పరచుటకై సూచించిరి. ఉస్మానియా కళాశాల ప్రొఫెసరులగు జాఫర్ హసన్ సా॥ సహకారదినప్రాముఖ్యముగూర్చి ఉపన్యాస మొసగిరి. అనంతరము గత సహకార తరగతి పరీక్షలయందుత్తీర్ణులైన వారికి పట్టము లొసగబడెను. ప్రావిన్సు, సహకార పరిశ్రమల శాఖాధ్యక్షులగు బి. ఎ కాలిన్సుగారు సహకారోద్యమ యుద్దేశములగూర్చి యుపన్యసించిరి. కోత్వాలు బహద్దరు కృతజ్ఞతతో సభ ౫ గంటలకు ముగిసెను

### సికింద్రాబాదులో ప్లేగు

సికింద్రాబాదులోకూడ ప్లేగు ప్రారంభమగు సూచనలు గాన్పించుచున్నవి. ఇటీవల యొకడు హైదరాబాదు గౌలిపురమునకు వచ్చిపోయినవాడు మరణించెను.

### కె. చాందిగారు

మైసూరు స్టేటు కౌన్సిల్ పూర్వపు సభ్యులును, మైసూరు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులును గు కె చాందిగారు బి ఎ సికింద్రాబాదుకు వచ్చియున్నారు వీరు రైల్వే ఆడిటర్ లగు ఎస్. జి పోతిన్‌గారి గృహమున బసచేసియున్నారు.

### నవాబు బసాలత్ జం బహద్దురు

మంగళవారం రోజు ౫౹ ౧౦ టికి నవాబు బసాలత్ జం, బహద్దరు జిల్లా పోలీసు కార్యాలయమునకు వచ్చిరి జిల్లాల రక్షక శాఖాధ్యక్షులు ఆదర్శప్రస్థాపింపగా గారును వారి సహాయులును స్వాగతమొసగిరి వీరు కార్యాలయమంతయు దర్శించిరి వీరు పన్నెండు గంటలకు వెడలిపోయిరి

### స్వదేశీలీగుసభ

నిన్న సాయంత్రము ౫ ౯ టలకు స్వదేశీలీగు కేరఫున విక్టోరియా హోటల్ ప్రక్క మైదానములో రామచంద్ర నాయుడు గారి యాజమాన్యమున సభజరిగెను. సభకు అయిదారు వందలమంది వచ్చిరి. సిటీకాలేజి ప్రొఫెసరులగు ఫజల్ రహమాన్ సా॥ భారతదేశపరిశ్రమలు అభివృద్ధి, నాశనముగూర్చి చరిత్రాధారములతో యుపన్యసించిరి. బాజీ కృష్ణారావుగారు పన్నెండుమందులు దేశములో పనిచేయుచున్నారనియు, కనుక పరిశ్రమల అభివృద్ధికై పాటుపడుట శ్రేయస్కరమనియు ఇతరులు స్త్రీలు రాట్నము ఉపయోగించవలెననియు తెలిపిరి. బూర్గుల రామకృష్ణా రావుగారు స్వదేశీవస్తువుల ప్రాముఖ్యతనుగూర్చి, ఆంగ్లములో నుపన్యసించిరి. అధ్యక్షులు తమ ఉపసంహారోపన్యాసమునందు ఈ వ్యాసముల అభిప్రాయములగూర్చియు, స్వదేశీ వస్తు ప్రాముఖ్యమును గూర్చియు నుపన్యసించిరి. మౌల్వీ గజన్‌ఫర్ హుస్సేన్ సా॥ గారి కృతజ్ఞతతో సభ ముగిసెను.

### మిషనరీస్కూలు

హైదరాబాదు వ్యవసాయ శాఖయందు వచ్చేనెల ౧ తేదినుండి మిషనరీపనిముట్లు నడుపుటకు నేర్పుటకై తరగతి ప్రారంభింపబడినది. ఇంకవరకు ౫ గురు విద్యార్థులు చేరినారు వీరికి మూడునెలల వరకు శిక్షణ యొసగబడును.

### న్యాయవాద పరీక్షలు

అవ్వల్, దువ్వం సువ్వం దర్జాల వకాలత్ పరీక్షలు హైకోర్టునందు జరుగును. అవ్వల్ దువ్వం పరీక్షలు బహమన్ నెల ౨వ తేదినుండి ౧౨ తేదివరకు జరుగును. సువ్వం దర్జాపరీక్షబహమన్ ౨౨ తేదినుండి ౨౫ తేదివరకు జరుగును బహమన్ ౪, ౫ తేదులయందు సెలవులగుటచే ఆరోజులలో పరీక్షలు జరుగవు.

### ఉస్మానియా కళాశాల ఖేలనములు

నిన్న ఉస్మానియా కళాశాల ఖేలనములు నిజాం కాలేజి మైదానమున ౨ గంటలకు ప్రారంభమయ్యెను. దీనిని వీక్షించుటకనేకులు వచ్చిరి. పరుగెత్తుట, గుండువేయుట, త్రాడులాగుట, కోడిబంతిని తన్నుట, మున్నగు ఖేలనములు జరిగినవి.

### విందు

నిన్న సాయంత్రము ౪=౩౦ గంటలకు రాజాధిరాజ గిరిజాగారు బొంబాయి హోటలు మెంబరులకు సర్ అక్బర్ హైదరీగారికి వి. దొసగిరి దీనికి అధికార అధికారేతర ప్రముఖులనేకమంది వచ్చిరి వారిలో రసిడెంటు గారు మహారాజా బహద్దరు నవాబు లుత్ఫుద్దౌలా బహద్దరు రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు కోత్వాలముఖ్యులు ఈ సమావేశము ౬ గంటలకు ముగిసెను

### ఇంజనీరుల మార్పులు

సుపరింటెండింగ్ ఇంజనీరులగు వి. సి. పాలుగారు డిప్యూటి ఇంజనీరులగ చేయబడిరి అందువలన దిగువ డిప్యూటి ఇంజనీరులుగ చేయబడిరి. అందువలన దిగువ మార్పులు జరిగినవి.—

౧. వి సి పాలుగారి బదులు అహమద్ మిర్జా సా॥ స్పెషల్ సుపరింటెండిగ్ ఇంజనీరులగను.

౨ గోపాలన్‌గారు సుపరింటెండింగ్ ఇంజనీరులగను,

౩. అబ్దుల్లా సా॥ రాయచూరునుండి హైదరాబాదునకు.

౪. సాబరీ యూసుఫ్ సా॥ ఉస్మానాబాదు నుండి రాయచూరుకు

౫. నియామతుల్లాఖాన్ సా॥ సంగారెడ్డినుండి చదరఘాటుకు,

౬. మహమ్మదు అజహర్ సా॥ స్పెషల్ డివిజన్ నుండి సంగారెడ్డికి,

౭. సయ్యద్ మహమ్మద్ యూనిస్ సా॥ కృష్ణా ప్రాజెక్టు సైమాయు పనిపై నియమింపబడిరి.

౮. నిజామాబాదు మహమ్మదు ఇబ్రాహింసా॥ చీఫ్ ఇంజనీరు మదద్గారులుగను,

౯. రామచంద్రరావు గారు బీదరునుండి నిజామాబాదుకు,

౧౦. ఎస్ ఎం ఎచ్ నక్వీగారు కరీంనగరు నుండి బీదరుకు,

౧౧. రామచంద్రయ్యగారు ఆదిలాబాదునుండి కరీంనగరుకు

౧౨. సుపర్వైజరులగు టి. వి, నర్సింలు నాయుడు గారు ఆదిలాబాదు డివిజన్‌పైనను,

౧౩. వి సి దల్లాల్‌గారు తుంగభద్ర సైమాయిష్ పనిపై నియమింపబడిరి.

౧౪. జి, శ్రీనివాసరావుగారు పర్భనీనుండి ఆసిఫాబాదుకు,

౧౫. ఎక్బాల్ అలీ ఖాన్ సా॥ నల్లగొండనుండి పర్భనికి,

౧౬. సుపర్వైజరులగు జకీయుద్దీన్ సా॥ నల్లగొండ డివిజన్‌పై నియమింపబడిరి

## వైద్యము జంతువర్గము

డాక్టరు ఎ. అర్థరుగారు (పార్బలిస్టు)

మా నవుని ఆరోగ్యము నిమిత్తము, వృక్ష, జీవ, శిలా, లోహ, జాతులను ఓషధులుగా, నిర్మించిన భగవద్ నిర్మాణము ఎంతో ఆశ్చర్యమును జూపు చున్నది. అందు కొన్నింటిని నిందు పొందుపరచు చున్నాను.

1. అంబరు. Ambra Grisea

ఇది తిమింగలమను గొప్ప చేపకడుపులో నుండి తీసిన ఒక క్రొవ్వుపదార్థము. ఈ ఘనజాతి చేప మహాసముద్రము లో నుండును. ఒక్క చేప నుండి సుగంధ మిశ్రమైన అంబరు ౭౫౦ పౌనుల వరకు చిక్కునని చెప్పుదురు. ఇది కస్తూరివలెనే పనిజే యును. ఇది మిశ్రమవర్ణము గలిగి తెలుపు, పసుపు రంగులతో గూడియుండును. సుగంధ ద్రవ్యము లమ్మువారలు అంబరుతో విలువగల అత్తరును జేయుదురు. ఆయుర్వేద, హోమియోపతి, వైద్యుల మిశ్రమనందగును. మూర్ఛ, నరముల బలహీనత, కలరా, ప్లేగు వ్యాధులయందు మతిదప్పిన స్థితిలోనున్నప్పుడు ఈ యౌషధమును వైద్యులు గుర్తెరిగి, ౫ మొదలు 10 ధాన్యపు గింజలు ఎత్తు వరకు వాడుదురు. మరికొందరు ద్రావక, రూప మున వాడుదురు

కస్తూరిజింక నుండి కస్తూరి లభించును. ఈ విలువగల మృగము (Musk deer) చీనా, దక్షిణ అస్సాం, మధ్య ఆసియా, మనుష్యు లు ఎక్కజాలని హిమాలయ పర్వతముల 8000 అడుగుల శిఖరములపై, వాసము జేయును. ఇది ఋతువుకు వచ్చినప్పుడు చెట్లకును, కొన్ని రాళ్ళకును దీని ఋతువును రుద్దును. మొగ కస్తూరి జింకగడ్డయందు చిన్నరవాలవలె నలుపు, గోధుమ రంగు ఛాయవంటి కస్తూరి చిక్కును. నేపాళదేశపు కస్తూరి కాశ్మీరదేశపు కస్తూరివలెనే కొంచెము నలుపువర్ణముగా నుండి, వాసనయందు ఘాటు గలిగియుండును. చీనా, టిబెట్టు దేశములందు లభించెడు కస్తూరికన్నను, నేపాళ, కాశ్మీర దేశముల యందు దొరకు కస్తూరి హెచ్చు ధరలను గల్గి, ధరను పెంచికొందురు. మొత్తముమీద అలోపతీ, ఆయుర్వేద, ఆంగ్లేయ, హోమియోపతి, వైద్యులెల్లరును కస్తూరిని, మాత్రారూపము గాను, ద్రవరూపముగాను, ఇతర రూపములతోను. మతి భ్రమజెందినట్టియు, దేహమాద్యంతము చలువతో నుండినట్టియు, కలరా, ప్లేగు విషజ్వరము లతో బాధపడువారి పాలిటి సంజీవియని యెంతురు,

ఏనుగు చచ్చినను, చచ్చినను వెయ్యి రూపాయలు అనుసామ్యము ప్రకారము, ఈఘనజాతిజంతువు సర్వాంగములును, ఔషధకారులని వైద్యులెంతురు. దీనిదంతము లతో చిత్రములైన పెట్టెలు మొదలైనవి జేయుదురు. అవే దంతములను కోసి, మిగుల విలువగల ముత్యపుసరులను ధనులు ధరింతురు. ఎదలలో బుట్టిన రుగ్మతలు వీటి వలన పోవును. ఏనుగదంతమును పొట్టుతో కాల్చి భస్మము చేయునట్లు జేసి స్త్రీల ప్రదర రోగముల తోను, అబలా బలహీనతలకును, హాలీమకమను కామిలా జబ్బులకును గుర్తించి వాడుదురు. దీని కాల్చిన మసిని, తిలతైలముతో కలిపి, పేను కొరుకుడు యను ఇంద్రలుప్తమునకును, వెండ్రుకలూడిన బట్టతలకును పూయుదురు. కొన్ని మదించిన గజముల కుంభస్థలములందు విలువగల ముత్యముల హారములు లభించును. దీని చర్మమును కాల్చి మసిజేసి, కొమ్మునూనెలో కలిపి శ్వేత పొడలకు రుద్దుదురు. దాని కాలిగోళ్లు, జంబీకు, పాము కుబుసము, మొలల [Piles] వ్యాధికి పొగ వేతురు. తుదకు దీని లద్దెను భద్రపరచి, బూడిదె చేసి అరికాళ్లకు కణతలకు పెట్టుదురు.

కొండలలో మేయు అడవిమేకలు నుండి తీయు మేకరాళ్లు (పావుదారు) పిల్లలు వైద్యమునకు ప్రసిద్ధి. అడవిమేకల పిత్తములో ఒక్క తులము వలాందా ఇంగిలీకము నుంచి, అది ఎండిన పిదప మరియొక మేకపిత్తములో నుంచుచూ, ఇట్లు 9 లేక 11 పిత్తములలో నుంచి తీసిన, ఇంగిలీకము మెత్తబడిన పిదప అది భేషజుని ధనముగా ఔషధములయందు పరిణమిల్లును. ఈ సూత్రము వనవాసులగు ఋషిశ్రేష్ఠులెరిగినదై యున్నది

ఆవుల గోవునుండి తీయబడిన గోరోజనమను పదార్థము మహావైశిష్ట్య సంకటముల యందును, విష పురుగుల విషమునకు విరుగుడుగాను, అనేక రోగములయందద్భుతము సాధనముగాను చాల పాపల కాపాడు సంజీవిగను వెలయుచున్నది.

ఇవ్విధమునవే, కూర్మపిత్తం, రోహితను చేప పిత్తము (దీనినే రోయిపీత యందురు) మర్కటం, పునుగు, జవ్వాది, మున్నగు పదార్థములు, మానవారోగ్యమునకు ఆధారభూతములై యున్నవి. వాటి గుణాతిశయములను గుర్తించి చికిత్సలను జేయు వైద్యోత్తములు, రోగులపాలిటి ప్రాణమిత్రులై యుందురు. ప్రస్తుతము చవుకగా యమ్మబడు కస్తూరిమాత్రలు, ఏమియును పనిజేయు లేదని సణగువారలకు, ఈ దిగువ శ్లోకప్రకారము తయారు జేసినయడల వైద్యులనామము కొనియాడబడును.

ఏకభాగం మృగమదం ద్వి భాగం వ్యోషముష్కకం। త్రిభాగం వత్సనాభం చ। కూర్మపిత్తం చతుర్థకం। పంచభాగమత్స్యపిత్తం సౌరాష్ట్రి షష్ఠ భాగికం। సప్తకం పద్మకం చైవ। వసుభాగంతు ఫేనకం। నవ భాగం రోహిణీచ। మాగధి దశభాగికం। ఏకాదశంతు సింధూరం। సర్వం ఖల్వవినిక్షిపేత్। చిత్ర మూలకషాయేణ। మర్దితం యామ మాత్రకం। ముద్గా ప్రమాణవటుకా। చాయా శుష్కం చ కారయేత్తు। అనుపానవిశేషేన దాతవ్యాం చ భిషగ్వరైః। అతిసారేచ బాలానాం। మలబద్ధేచ రోగ జయతు। గోక్రత్ప మహావాతే। బాలరోగ నివారణం। జ్వరఘ్నం సన్నిపాతఘ్నం। కాసఘ్నం చ కఫాంతకం। అశీతి ర్వాతశమనం। శ్వాసఘ్నం చ, కఫాంతికా। అశీతి ర్వాతశమన। శ్వాసఘ్నం చ సదాభవేత్తు। నారాయణ రసోనామం। పూజ్య పాదేన నిర్మితం॥

టీక॥ 1 భాగము కస్తూరి; 2 భా. భూతి పిల్లిగడ్డ; 3 భా. శుద్ధిజేసిన వత్సనాభి; 4 భా. తాంబేటి చేతికట్టు; ౫ భా. రోయిపీత; (ఇదిఒకచేపచేదు). 6 భా. గోరోజనం; 7 భా. పావుజున్ను; 8 భా. పావుజారు; 6 భా. కటుకరోహిణి; 10 భా. అక్కలకర్ర; 11 భా. రస్సింధూరం.

ఈ వస్తువులన, ఖల్వములోవేసి చిత్రమూలకషాయముతో మర్దించి, చిన్నపెసరు గింజల వలె మాత్రలుజేసి, భద్రపరచి, ఆయా అనుపానములతో వాడిన, యోగమునం దుదహరింపబడిన, రోగములు కుదురుటవనట కాశ్చర్యము లేదుగదా!

## సనాతనధర్మసంస్థ ప్రకటన

పండిత కేశవరావుగారు ప్రవేశపెట్టిన బిల్లులపై అభిప్రాయము తెలుప వలయును.

పూర్వపు న్యాయమూర్తులగు పండిత కేశవ రావుగారు మన శాసన సభ యందు వితంతూద్వాహము గూర్చియు బాల భార్యలతో సంభోగము గూర్చియు, (౩ ౧ దఫా అలీపు లా జీరాత్ ఆసఫియా) రెండు బిల్లుల ప్రవేశపెట్టి యున్నారు వానిపై అభిప్రాయములు సంగుటకై శాసన సభా కార్యదర్శులు కోరియున్నారు కాని సనాతనధర్మ పరాయణులు తమ అభిప్రాయమును జై ౩ల ౧౫ వ తేదీ వరకు వ్రాసి కార్యదర్శి సనాతన ధర్మ సంస్థ, గౌలీగూడెము, హైదరాబాదునకు, పంపవలయును అటు పిమ్మట చేరిన అభిప్రాయములలో అధిక సంఖ్యాకులేమి కోరు చున్నారో నిర్ధారణచేసి శాసనసభా కార్యదర్శి గారికి తెలుపబడును.

### వితంతూద్వాహ బిల్లు

దఫా ౧:— హిందువుల ధర్మశాస్త్రములు లేక ఆచారములు దీనికి వ్యతిరేకముగ నున్నను ప్రతి హిందూ వితంతువు వివాహ మాడుట కధికారము కలిగియుండును. ఈ వివాహము న్యాయ సమ్మతమైనదిగ నెంచబడును. ఈ విధముగ వివాహము చేసికొనిన వారి సంతానము కూడ న్యాయమైనదిగ పరిగణింపబడును.

దఫా ౨:— ఇట్టి వివాహము ఆయా వర్ణములకు జెందినవారి ఆచార వ్యవహారాదుల ప్రకారము జరుపబడును.

దఫా ౩:— ౧౬ వత్సరములకన్న హెచ్చు వయస్సుగల వితంతువు వివాహముచేసికొనజాలదు. ఇదేవిధముగ ఇట్టి వితంతువును వివాహమాడుటకు ఏపురుషునికైనను అధికారములేదు.

దఫా ౪:— ఇట్టి వివాహము వలన తన పూర్వపు భర్తయొక్క ఆస్తిపై ధర్మశాస్త్ర ప్రకారమొక వితంతువు కుండవలసిన హక్కు తొలగిపోవును. కనుక ఇతర వారసులు ఆ వితంతువు చనిపోయి యుండిన యేవిధముగ ఆయాస్తికి హక్కుదారులగుచుండిరో ఆదేవిధముగ ఆ యాస్తి ఆ వారసులకు జెందును.

దఫా ౫:— వితంతూద్వాహము జరుగుచున్న ఆయాజాతుల వితంతువుల హక్కులపై యీ శాసనము ప్రకారము చర్య గైకొనబడదు.

(బ్రిటిషు ఇండియాలో ఇదేవిధముగ ఆక్టుగను, ౧౮౫౬ సంవత్సరములో జారీ చేయబడినది.)

### దఫా ౩౧౧ అలీపు లాజీరాతు

ఎవ్వడైన ౧౩ వత్సరములకన్న తక్కువ వయస్సుగల తనభార్యతో సంభోగించినచో అతనికి ఒక సంవత్సరమువరకు శిక్ష లేక జుర్మానా విధింపబడును. లేక రెండును యొసంగబడును. కనుక ఈరెండు శాసనములపై అందరు తమతమ అభిప్రాయములు తెలుప ప్రార్థితులు.

రామచంద్రరావు
సం. కార్యదర్శి

## జాతీయ నాయకుల అభిప్రాయములు

బ్రిటిషువారి పరిపాలనము కొన్నినాళ్ళే.

నాలో కొంతమంది నీ విపుడే కారాగృహము నకు వెడలవద్దని చెప్పిరి. కాని నేనును జేలుకు పోవుకుండుట లేక పోవుట అంతే అవసరమైనదిగా భావించుటలేదు. కాని ఒకవేళ ఏదైన హిందూదేశ గౌరవమునకు భంగముగలుగు విషయము సంభవించిన నేన ఆగజాలను. ప్రస్తుతము బొంబాయిపట్టణమునందు వానరసేనతప్ప తక్కినవారందరు తిరుగబడిరి. మన పరోక్షమున నిపుడొక జాతి గలదు దీనితో గొప్ప సమరము తటస్థించినది. దీనిని ప్రపంచ మెరుగును. జాతి గుర్తెరుగును. ఆంగ్లేయులు కూడ యెరుగుదురు. మన మొకవేళ ఆంగ్లేయ జాతిని జయింపకున్నను క్రింద మాత్రము పడ వేసితిమి. ఈవిధముగనే మనము త్వరలో వీరిని వెడలకొట్టుదుము కూడను.

పత్రికలకేన్నియో నిర్బంధము కలిగింపబడినవి. ఇంతేకాక అనేకవిధములగు వార్తలను గప్పిపెట్టు ప్రయత్నములు జరుపబడుచున్నవి. కాని సకల ప్రపంచమును బ్రిటిషు ప్రభుత్వము దినములలో గడచను విషయమును గుర్తెరింగియున్నది. మరియు హిందూదేశము వీరిని అంతమొనర్చివిడిచిపెట్టును.

(పండిత జవాహర్‌లాలు నెహ్రూ)

రైతుల క్షేమ స్వాతంత్ర్యము

జాతీయ మహాసభాధ్యక్షులగు పండిత జవాహర్‌లాలు నెహ్రూగారు కృషక యూనియన్ కాంగ్రెసుకుగూడ అధ్యక్షులుగా గలరు. రాజ్యాధిపత్యముచేతను, పెట్టుబడిదారుల ప్రభుత్వము వలనను, శాంతి యున్నటికిని చేకూరజాలదనియు, స్వాతంత్ర్య ప్రభుత్వ సంపాదనకై పూర్వము జమీందారులకు వ్యవసాయమువలన గలుగుచున్న లాభమును వినాశ మొనర్చు ప్రయత్నము చేయవలయు ననియు ప్రస్తుతముగల జమీందారీ పద్ధతి తొలగించ వలయుననియు ఢిల్లీ యూనియన్ కాంగ్రెసు సభయందు వీరు వాకృచ్చిరి.

మహాత్మా గాంధిగారు స్వయముగ తమ జీవితమును వ్యవసాయకుల సేవకును, ఆర్థిక సంస్కరణమునకు వినియోగించుచున్నారు. వీరు వ్యవసాయకులకు పనిలేని దినములలో పని గల్పించుటకు ప్రయత్నించుచున్నారు. ఇంతేకాక వీరు సారాయి, ఇతర మత్తు వస్తువులను, రూపుమాప జేయుటకుగూడ ప్రయత్నించుచున్నారు. వీరికి అస్పృశ్యత, హిందూదేశ ఆర్థిక ఇబ్బందులును, ఇతర కష్టములును, తొలగించుటలో కలిగిన జయము బహుశా ఇతర ఏవ్యక్తికిని సిద్ధించజాలదు. వీరు ఆకలిచే చనిపోవుచున్నవారికి కల్పించుట వలనను, జీవనోపాధి గడించుటవలను, ముక్తి గలదని ఉపదేశించిరి. ఆర్థిక స్వాతంత్ర్యమునకు స్వపరిపాలన మవసరమని వీరి అభిప్రాయము.

కాంగ్రెసుయొక్క మూడవ ముఖ్య వ్యక్తి, మహాత్మాగాంధి శిష్యులగు సర్దారు వల్లభభాయి పటేలుగారు ఈ విఖ్యాత పురుషుడే బార్డోలీ రైతులకును ప్రభుత్వమునకును జరిగిన సంగ్రామమునందు రైతులకు విజయము సిద్ధింపజేసెను. రైతులపై వీరికి గాఢమగు ప్రేమ గలదు. వీరు ఒకప్పుడు తమ యుపన్యాసమునందు వ్యవసాయ వృత్తిదారులును ప్రభుత్వమునకు రెండంగములు అని నుడివి యుండిరి. వీరే ద్రవ్యోపార్జన జేయు సాధకులు. కాని వీరికే ద్రవ్య ముండదు కనుక వీరేమియు చేయజాలకున్నారు.

(రెజనాల్డు రైనాల్డు)

---

## నిర్బంధ విధానమే తగిన ఔషధము

రాజకీయము లందు పాల్గొను వారిని నేరములు జేయువారి వలె శిక్షించ వలయును.

ఒక ఇంగ్లీషు ప్రముఖుని అభిప్రాయము

సేంట్ పాల్ డీను గు రెవరెండు విలియం రాల్ఫు ఇంజి గారు ఇట్లు వ్రాయుచున్నారు:—

నిర్బంధ విధానమే తగిన ఔషధము. రాజకీయములలో పాల్గొనినవారిని హత్యలు మున్నగు నేరములుచేసిన వారివలె శిక్షింపవలయును.

వీరు భారతదేశ పరిస్థితులగూర్చి తమ వ్యాసములో ఉదాహరించలేదు. కాని ప్రస్తుతము భారత దేశమునందు జరుగుచున్న నిర్బంధములును, శిక్షలును, వారి దృష్టియందు లేకుండెనని చెప్పజాలము

---





---

## ప్రకటన

దైవ కృపవలన జనుగామ తాలూకాలోను దాని సమీపవ తాలూకాలలోను ఎట్టి వ్యాధులు లేవు. కనుక ఈ సంవత్సర ఉర్సు జీడికల్లు యుత్సవము దైశాఖ నెల ౨ వ తేది నుండి ౧౨ వ తేది వరకు జరగ గలదు. ఈ సారి ఉత్సవ మతి వైభవముగ జరుపుట కేర్పాట్లు చేయబడుచున్నవి. వివిధవస్తువుల దుకాణములు వచ్చుటచే వ్యాపారము జరుగగలదు. దేశమునందు తయారగు వస్తువులును, కోడెలును, ప్రదర్శింపబడును. ఇవి తెచ్చిన వారికి వెండికడియములు బహుమానముగ నివ్వబడును. కనుక వర్తకులును, పరిశ్రామికులును, యాత్రికులును, ఈ సమయమును పోగొట్టుకొనక తప్పక యుత్సవమునకు రావలయును, పరిశ్రామికులును, మున్నగువారు జీడికల్లుకు వచ్చి తమరాకగూర్చి తహసీల్దారుకు తెలుప వలయును. వారికి తగిన సహాయము చేయబడును.

షరేద స్తఖత్
అహమద్ నూరుల్ ఆస్పియా పేష్కారు
మింజానిబు తహసీల్దారు జనుగామ

---

## గోలకొండ బుక్ డిపో

| | |
|---|---|
| ౧ రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧-౪-౦ |
| ౨ సంఘోద్ధరణము | ౦-౨-౦ |
| 3 పంచముల చరిత్ర | ౦-౪-౦ |
| ౪ భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౪-౦ |

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జీడికంటి రామశతకము 3 బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కృష్ణాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములుచితముగ నివ్వబడును. టపాల ఖర్చులు వేరు.

కాన్ఫరెన్సుబూలియ్యతులు నూటికి రు 3 లు,

గోలకొండ బుక్ డిపో
౧౫ ౨౫, గోశాబజారు హైదరాబాదు (దక్కన్)

## శ్రీకృష్ణా సుదర్శన హోటలు
**(Sudershan Hotel)**
అఫ్జల్ గంజు హైదరాబాదు

విశాలమైనగదులు, పరిశుభ్రమైన రుచికరమగు భోజనము నగరమునకు మధ్యం ఉన్నది. కార్యాలయములు, పాఠశాలలు, మార్కెటులు బజారు మొదలగునవి అందుబాటులో గలవు. ఒకసారి దర్శించిన అన్నియు విశదము కాగలదు. ధరలు అతిచౌక. వెంటనే వివరములు కనుగొనుడు

మేనేజరు

## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

1 జి. ఆర్. మూర్తి రబ్బర్ స్టాంపు మేకరు గౌలిగూడ
2 నా. గౌరిశంకరవర్మ రెసిడెన్సిబజారు
3 కాళిదాసు బి పురోహిత్ ,,
4 టి. యస్. మెహతా పత్తరు మసీదు ఎదుట } గౌలిగూడ
5 ధర్మయ్యాచారిగారు భువనగిరి




గోలకొండపత్రిక
గోశాపు బజారు హైదరాబాదు దక్కన్.
సంవత్సరము చందా
రు. 2—౦—౦
అర్ధ ,, 3—౧౨—౦
ఒక ప్రతి —౧—౮




and Published byG. Ramakrishna Red at Golkonda PowerPress, Hyderabad, Dn Editor K BalakrishuReddya.